→ హే సవ్యసాచి. ఏమను, కుడి చేతులతో బాణాలు వేసేసి మనగాన్ని అనుకుంటున్నావేమో అదిలా పక్కన పెట్టు. నిమిత్తం మాత్రుడవు కమ్ము. అంటే ఈ ఉపాధి ద్వారా జరగాల్సిన కృత్యాన్ని జరగనీయి. నువ్వు ఆటంకం రావద్దు. ఏమిటి ఆటంకం? అహంకారము, మమకారము (భోక్తృకర్తృత్వము). ఈ రెండే ఆటంకాలు. కాబట్టి ఈ రెంటినీ నువు పక్కన పెట్టియే పక్కన పెట్టేసేం అర్జునుడు నిమిత్తము అని మొత్తం జగత్తుకి బోధించాడు శ్రీకృష్ణుడు

→ కాబట్టి ఉపాధిగా అర్జునుని నిమిత్తంగా చేసుకొని భగవాన్ వాసుదేవః ఆహ అశోచ్యాన్ ఇత్యాది.

→ ఏమని చెప్పారు ఆయన అశోచ్యాననన్వశోచస్త్వం అని మొదలు పెట్టి చెపుతున్నారు.

(02/17 (or) 21-01 - 20:30)

## సముచ్చయ వాదము (పూర్వ పక్షము) :-

→ ఇక్కడినుంచి ఒక విచారము. అంటే చర్చ "తత్ర కేచిదాహుః ..." అని అంతలో కొంతమంది ఇలా చెపుతున్నారు. ఎందుకంటే ఆత్మజ్ఞానము ఒక్కటే మోక్ష సాధనము అని అనగానే, అనేకులు మంది నిలబడతారు objection అని. ఎందుకంటే ఆత్మ జ్ఞానము ఒక్కటే అయితే మరి మా మాట ఏమిటి? మేము ఒక system ఇంకొకటి తయారు చేసి పెట్టుకున్నాము, where do we stand అని కర్మ వాదులు, ఉపాసనా వాదులు వీళ్ళు అన్నారు, మాకు అలా కుదరదు. మా కర్మ శక్తి మోక్షం అంటారు వాళ్ళు. అన్ని వాదములను సరి చేయాల్సి ఉంటుంది ఎందుకంటే ఏనాడో ఒక్కడు అన్నాడంటే ఆ సందేహం మనకి కూడా వచ్చే అవకాశం ఉంటుంది. కాబట్టి ఒక విస్తృతమైన చర్చ మళ్ళీ class లో.

ఇక్కడ టీకలు ఒక పూర్వ పక్ష సిద్ధాంతాన్ని చెపుతున్నారు

→ "తత్ర కేచిదాహుః :- సర్వకర్మ సన్న్యాస పూర్వకాద్ ఆత్మజ్ఞాననిష్ఠా మాత్రాద్ ఏవ కేవలాత్ కైవల్యం న ప్రాప్యత ఏవ। కిం తర్హి? అగ్నిహోత్రాది శ్రౌత స్మార్త కర్మ సహితాద్ జ్ఞానాత్ కైవల్య ప్రాప్తిః ఇతి సర్వాసు గీతాసు నిశ్చితః అర్థః ఇతి"

→ అసలు మొట్టమొదటి పేచి ప్రారంభం గీతలో - కర్మ గొప్పదా, జ్ఞానం గొప్పదా? ఏదో ఒక్కటే నే ఒక్కటి వాదిస్తే ఉంటుంది Eg:- బాల గంగాధర్ తిలక్ - గొప్ప జ్ఞాని - గీతారహస్యం వ్రాసారు jail లో - ఇర్వ్య సౌకర్యాలు - ప్రేమ లేదు అని కాదు - వెళ్ళడానికి అవకాశం లేదు. కర్మ ప్రధానంగా రాసారు - అంటే - స్వాతంత్ర్య సంగ్రామంలో ఉన్నాము - జనసామాన్యానికి జ్ఞానం ఏమిటి? - స్వతంత్రం లేక జ్ఞానం గాక - సమాజానికి కర్మ ప్రాధాన్యతే బోధించాలి మనం అని అంటాడు

→ కాబట్టి కర్మ గొప్పదా జ్ఞానం గొప్పదా? అనే విచారం ఈ మిడిమిడి జ్ఞానం గలవాళ్ళకే గాని మహాత్ముల దగ్గర ఆ భేదం ఏమీ ఉండదు. ఈ ఏది గొప్పదో మనకి స్పష్టంగా తెలుస్తుంది

→ "మనిషి యొక్క అంతరాత్మ స్వరూపానికి ఒక్క అడుగు దూరంలో కర్మ ఉంటుంది. ఆ స్వరూపంలో భాగంగా జ్ఞానం ఉంటుంది."

ఉంటుంది. మనిషి అంటే కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు. మనస్సు రెండిటికీ common గా ఉంటుంది. కర్మేంద్రియాలతో కర్మలు, జ్ఞానేంద్రియాలు, మనస్సు బుద్ధి దానితో పని తెలుసుకుంటారు. వీటిల్లో ఏది బహిరంగము, ఏది అంతరంగము? మనిషికి బాగా దగ్గరది. కొంచం దూరమైనది! Intrinsic & Extrinsic అని అడుగు అలా. Eg:- భార్య - బావమరిది. బావమరిది - friend అలాగే కర్మ - జ్ఞానము ఈ రెండిటిలో చేతులు, కాళ్ళతో చేసేది బహిరంగమని కన్ను తోటి, మనసు తోటి చేసేది అంతరంగమని తెలియటానికి వాడు ఏమంత పండితుడు అయి ఉండాలి? మహా విద్వాంసులమైతే ఈ పేరు కూడా తెలియకుండా వాదాల్లో పడిపోతారు. ఎవళ్ళకి జీతం ఎక్కువ ఇస్తారు? company వాళ్ళకి కూడా తెలుసు.

→ కాబట్టి కర్మ, జ్ఞానము ఈ రెండూ మనిషి జీవితంలో ఉన్నాయి. వీటిల్లో జ్ఞానము మనిషి స్వరూపానికి దగ్గర. కర్మ బహిరంగంగా ఉండి జ్ఞానానికి సహకారం చేస్తుంది. కాబట్టి కర్మ ఉపాయము. జ్ఞానము ఉపేయము. కర్మ బహిరంగము, జ్ఞానము అంతరంగము.

→ అజ్ఞానులలో రెండు రకాలు. 1) తన అజ్ఞానంతో తాను బ్రతకటం 2) అజ్ఞానాన్ని philosophise చేస్తాడు. He creates the philosophy out of that ignorence దాంతోటి అలాంటి వాదులు చాలామంది మనకు కాలం నాటికి పెరిగిపోయారు. Eg:- శాస్త్ర ప్రముఖాచార్య etc. వాళ్ళకి కర్మ మీద ప్రతిపత్తి, prejudice ఉంటాయి. ముందే నిశ్చయం చేసుకుంటారు. కర్మ ఉండాల్సిందే జ్ఞానానికి సాధనం లేదు అంటాడు ముందే. అటువంటి వాడు ఆ మాట మాట్లాడటం వల్ల మనకేంటి ఆ మాట అన్నాడంటే ఇక వాడితోటి ఆ ప్రసంగం పెట్టుకోకూడదు. ఎందుకంటే వాడు జ్ఞానం విషయంలో కొంత విరోధము పెట్టుకొని కూర్చున్నాడు అప్పుడే. కర్మ మనతోటి ఉంటుంది కాని జ్ఞానాన్ని మనం సంపాదించాలి అంటే He is the right guy. వాడు జ్ఞానానికి సాధనాలు ఏముంది లేదు ముందు కర్మ అంటున్నాడంటే Already He is one step down. కర్మ మీమాంస వాళ్ళు ఏమన్నారంటే - కర్మే ముఖ్యము అన్నారు. మనిషి అసలు జ్ఞానానికి ప్రాధాన్యం, కర్మ secondary అవుతుంది కదా అంటే? అయితే ఓ పని చేద్దాం. let us have a compromize formula. మనం కర్మని జ్ఞానాన్ని Synthasize చేద్దాం. Synthasize తప్పేమీ లేదు చేయొచ్చు. కానీ synthasize చేయటానికి యోగ్యత ఉండాలి Eg:- పాలు, నీళ్ళు synthasize చేయొచ్చు. But oil & water you can not

→ అలాగే జ్ఞాన కర్మలు కూడా - ఇప్పుడు ఇంతకీ గీతలో సర్వోత్తమమైన ప్రతిపాదన ఏమిటి?

జ్ఞానము. మంచి

→ ఆ ఆత్మ జ్ఞానము వలననే ఈ సంసార బంధము నుండి విముక్తి, శోకము, అజ్ఞానము, భయము

మరణము నుండి, సంసారము నుండి విముక్తి జ్ఞానం వల్లనే లభించును. మరైతే కర్మ
మనకు పనికి రాదంటారా? మరి కర్మ మనకూ పనికి రాదంటారా? పనికొస్తుంది. కర్మను సక్రమంగా చేస్తే
అంటే నిష్కామ కర్మ యోగంగా కర్మ చేస్తే - దానికి జ్ఞానం ఉండాలి. కర్మకి నిష్కామ కర్మ
యోగంగా లక్ష్యం దిశగా అంటే నీకు మనసు ఏదో ఒకటి ఉండాలి అక్కడ కూడా జ్ఞానమే. మా
ఎప్పుడూ కూడా knowledge is action. కాబట్టి ఇప్పుడు మీరు పని చేస్తున్నారనుకోండి
స్థూలంగా చూసినాడికి చేతులతో పని చేస్తున్నారు లేకపోతే Instrument తో పని చేస్తున్నారు అని
అనిపిస్తుంది కానీ Eg:- Surgen - surgery చేస్తుంటాడు. Is it action or knowledge?
it is action superficially But it is knowledge in action. Suppose knowledg
లేదనుకోండి, ఏమవుతుంది?, knowledge & action 50%, 50% పెడితే అది కూడా
యాక్సిడెంట్ కాదు. Eg:- ఒక కోసుకుంటే, అప్పుడే ఏదో తెలుస్తుంది అని చెయ్యటం. etc
→ knowledg. Action? ఏమీ ఉండదు లేదు. knowledge. Doctor want to know
before he opens. He doesn't want to be surprised. దాన్నే Diagnosis
→ once he opens, He already knows, hence the action follows. Action వెనకే
పోదు; అది అలాగే ఉంటుంది. కాబట్టి కర్మని కూడా నిష్కామ కర్మ యోగముగా లక్ష్యం దిశగా చేస్తే
జ్ఞానము రావాలి జ్ఞానాన్ని మీరు పట్టుకోండి. Action వెనక్కి పోదు మీ వెనకాల ఉంటుంది
→ మీరు కర్మని అడ్డుపెట్టి జ్ఞానాన్ని Dilute చేసే పని ఎప్పుడూ చేయవద్దు జ్ఞానాన్ని
Dilute చేస్తారంటే వాళ్ళు జీవితంలో పరాభవాన్ని పొందుతారు.
→ సం ఇక్కడ అత్ర కైవల్యం లేదు:- కొంతమంది ఇలా అంటున్నారు. - చూడండి ఆత్మ జ్ఞాన
నిష్ఠ మాత్రం చేత మోక్షం రాదు. కైవల్యము - కైవల్యము అంటే అర్థం ఏమిటో తెలుసునా,
శోకము, మరణము, అజ్ఞానము ఈ మూడింటి నుంచి విముక్తిని పొందటం కైవల్యం అంటే
→ శోకం నుంచి విముక్తి కావాలంటే తన స్వరూపం ఆనందం అని, మరణం నుంచి విముక్తి
కొరకు తన స్వరూపము సత్ అని, అజ్ఞానం నుండి విముక్తి కొరకు తన స్వరూపం చిత్ అని
తెలుసుకోవాలి. ఈ మూడింటి నుంచి విముక్తి. దానిపేరే కైవల్యము: ఇప్పుడు వైకుంఠము,
కైలాసము, స్వర్గము అన్నవి మరణించిన తరువాత మాట. కైవల్యము అన్నది ఇప్పుడు, ఇక్కడ
కాబట్టి వేదాంతము / జ్ఞానము యొక్క ఫలము అతి క్షణము - Immediate & నిత్యము.
→ కర్మ యొక్క ఫలము Mediate - సుదూర భవిష్యత్ లో ఉంటుంది & అనిత్యము. మళ్ళీ వాపస్
కాబట్టి కర్మ మంచిదే. కాబట్టి కర్మని మనం, ఏమండి జ్ఞానం Important అని మనం చేయాలి కాబట్టి

త్రిగోట్ర్ము కొమ్మని చెప్పలేమా? అలా ఉండదు. వాటి స్థానంలో అవి ఉంటాయి. ఇది పరిస్థితి
→ కాబట్టి కేవల జ్ఞానము మనకి పూర్ణత్వమైన ఫలాన్ని మోక్షాన్ని ఇస్తుంది. ఆ జ్ఞానము
నందు సర్వ కర్మ సన్యాసము దానికి అంతర్భాగంగా ఉంటుంది. సర్వ కర్మ సన్యాసము అని చెప్పాను
ఇంతకు ముందు Re-cap చేసుకుంటే ఆత్మ కర్త కాదు అని తెలుసుకోవట అది సర్వ కర్మ
సన్యాసము. కాబట్టి ఈ ఆత్మ జ్ఞాన నిష్ఠయే కైవల్య హేతువు. అని మనం అనుకున్నాం. కొ
న్ని చెప్తుంటారు - "ఆత్మ జ్ఞాన నిష్ఠా మాత్రాద ఏవ కేవలాత్ నైవ కైవల్యం సంప్రాప్యతే ఏవ."
→ కేవల జ్ఞానము ఒక్కటే నీకు మోక్షాన్ని ఇవ్వదు. మరి ఇంకెలా వస్తుంది మోక్షం - పూర్వపక్షం -
మరి ఇంక ఎలా వస్తుంది అంటే కర్మలు ఉన్నాయి. శ్రౌత కర్మలు, వేద విహిత కర్మలు
అగ్ని హోత్రం, స్మార్త కర్మలు - సత్యనారాయణ వ్రతము etc. ఈ కర్మలని చేస్తుంటాము.
ఈ కర్మలని తోడు పెడితే, వాటితో కలిసి - Synthesis అన్నమాట - అంటే ఎలాగ,
కర్మలు they act as a prop అంటే అవి తోడుగా ఉండి, సహాయం చేసి జ్ఞానాన్ని
ముందుకు తోస్తే అప్పుడు వీరికి మోక్షం వస్తుంది. కాబట్టి "సముచ్చయము". కర్మ
జ్ఞాన సముచ్చయము. సముచ్చయం అనటంలో తప్పు లేదు, నష్టం ఏమి లేదు. ఇప్పుడు
కర్మ కూడా ఉండాలి అని అంటున్నారు గాని మరొకటి ఏమీ లేదు. మరి దాని గురించి ఇంత మీమాంస
ఎందుకు? అంటే చూడాలి there are problems in it. కర్మకి జ్ఞానానికి సముచ్చయం
కుదరదు. సమన్వయమే కుదురుతుంది ఈ మాట మనం చెప్తాను. సో అది ఇప్పుడు
చెప్పబోతున్నారు. సో సమన్వయంలో ఎవరికీ ఇబ్బంది ఏమీ లేదు. కర్మకి జ్ఞానానికి సమన్వయము
is ok. సముచ్చయము - ఒకే పురుషుడు, ఒకే కాలంలో రెండింటినీ కలిపి చేస్తే, దాన్ని
సముచ్చయము. వేరు వేరు పురుషులు, రెండింటిని చేస్తే లేదా ఒకే పురుషుడు
వేర్వేరు కాలములలో రెండింటిని చేస్తే దాన్ని సమన్వయము అని అంటారు.
Eg:- బ్రహ్మచర్యము గృహస్థాశ్రమము - సమన్వయము. గృహస్థులంటే - సముచ్చయం.
→ కాబట్టి జ్ఞానము కర్మ - సముచ్చయం కాదు. సమన్వయమే అని శాస్త్రం. శ్రీకృష్ణుని యొక్క
సిద్ధాంతము అది. అయితే చెప్తుంటారు. కేవలము జ్ఞానాన్ని Highlite చేసుకుంటే మా
కర్మలు ఏమయిపోవాలి కర్మయందు ప్రీతి. వాళ్ళు అలాగే ఉంటారు
Eg:- బృందావనంలో శ్రీకృష్ణుని photo - రాముని photo - లేదు ఇది అనుకున్నాము. అంటే
ఆయన నాకు అయోధ్య రాముడే అని అన్నాడు ~~(అంటే)~~ కాబట్టి ఇక్కడ
సమస్య ఏమిటంటే ఒక పూర్వాగ్రహము. ఒక నామ రూపాలకి కట్టుబడిపోవటం

రాముడి కంటే కృష్ణుడు గొప్ప అని ఆయన అభిప్రాయం. అంటే పూర్వాగ్రహం. అలాగే
కర్మ యందు ప్రీతి వీటికి. కర్మ యందు ప్రీతి లోటు గీతలో ప్రవేశిస్తాడు. కర్మ యందు ప్రీతి
ఉన్నవాడు గీత జోలికి రాకూడదు. Eg:- యజ్ఞశాలలో - గీతా పాఠము. చెప్పకు.
→ కాబట్టి గీత కామ్య కర్మలని support చేయదు. కాబట్టి ఈ కర్మవాది వాడు గీతలో
ప్రవేశించకూడదు. గీతలో ప్రవేశించి జ్ఞానం పైనగాని, సన్యాసంగానో పడలేరు అంటే ఒప్పుకోరు
ఒప్పుకోరు అంటే వారి మీద ద్వేష భావం ఏమీ కాదు. it just doesn't work కానీ
వీళ్ళు ఏమంటున్నారంటే "కర్మ జ్ఞానములు కలిసి మోక్షాన్ని ఇస్తాయి" అంటున్నారు.
→ అలవృత్తి శిరచ్ఛేదః

"
జ్ఞానవంచ లహి: అస్య అర్థస్య, అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న
కరిష్యసి (2-33), కర్మణ్యేవాధికారస్తే (2-47), కురు కర్మైవ తస్మాత్త్వం (4-15)
ఇత్యాదౌ ॥"
→ కొంచెం ఓపికగా చదవాలి భాష్యం, జాగ్రత్తగా వాదాలన్ని తెలుసుకోవాలి. ఈ
ఈ విషయాన్ని బలం చేయటానికి గీతాచార్యుడే చెప్పాడు ఈ మాటలు. కర్మ జ్ఞానము
కలిసి మోక్షాన్ని ఇస్తాయి గీతాచార్యుడే ఈ మాటలు అన్నాడు అని Quote చేస్తున్నారు
చూడండి ఎలా Quote చేస్తారో. Quotations ఎన్నివి ఉంటాయో చూస్తారా, మీరు ఎలా
కావాలంటే అలా Quote చేయొచ్చు. వినేవాళ్ళు Head knodders అని ఏది చెప్పినా తల
ఊపేవారు ఉన్నప్పుడు మీరు ఏది Quote చేసినా సరిపోతుంది Eg:- Communist
Gita Quote & objected Gita teaching. So Even a communist can quote
gita to support his view point
→ ఇక్కడ కర్మవాది Quote చేస్తున్నాడు Gita లో కృష్ణ చెప్పారు. అని ఎందుకంటే అథ
చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి అని. ఈ సంగ్రామము, ఈ యుద్ధము నీ
యొక్క కర్తవ్య కర్మ. నీ స్వధర్మము. నీ స్వధర్మాన్ని గనక నీవు చేయకపోతే, నువు నష్టపోతావు
చాలా పాపాన్ని మూట కట్టుకుంటావు అని అన్నాడు. మరి ఆ మాట అన్నది ఎవరు? శ్రీకృష్ణుడే
గదా. ఎక్కడ అన్నాడు గీతలోనే అన్నాడు గదా. దాని బట్టి నీకు ఏమి తెలిసింది కర్మ గదా మరి
అక్కడ అని Quotation. కురు కర్మైవ తస్మాత్త్వం అని అన్నారు. అందువలన - తస్మాత్
అంటే అందువలన కురు కర్మైవ కర్మనే చేయి అన్నాడు. అది Quotation. కాని కర్మనే చేయి

(21-02 - 00:01)

అనంతరము నువు కర్మనే చేయి అని అన్నాడు. తాత్పర్యం - అర్జునుని కర్మ చేయమన్నాడు. ఎందుకంటే వాడికి ఇంకా జ్ఞానాధికారం లేదు గాబట్టి అర్జునుని కర్మ చేయమన్నాడు. కానీ వాడు ఏం చేశాడు ఒక Quote చేసి ఇదిగో శ్రీకృష్ణుడు కర్మయే మోక్ష హేతువు అని చెప్పినాడు.

→ఇంక final గా కర్మణ్యేవాధికారస్తే, అప్పుడు కూడా ఆ అధికారః నీకు - అర్జునునికి. అర్జునుడు ఓటికే నేను సన్యాసం తీసుకుంటాను అంటే ఓరి వెర్రిముండా సన్యాసానికి నీకింకా లేదు, కర్మ చెయ్యి అని చెప్పారు. అంటే అర్థం కర్మ వల్ల మోక్షం వస్తుందని? కాదు వాడు అలా Quote చేస్తాడు దాన్ని. వా ~~[illegible]~~

→కర్మ విరోధ వాక్యాన్ని ఒకదాన్ని ప్రవేశపెట్టి దానిని కూడా పరిష్కరించారనుకోండి, ఇప్పుడు ఈ కర్మ వాదము మరింత బలపడుతుంది. కర్మకి oppose చేసే వాదాలెన్నో ఉంటాయి. ఎందుకంటే కర్మ అనేటప్పటికి All problems. ఇప్పుడు ఆత్మ పూర్ణము అని అన్నారనుకోండి దానికి, దీంట్లో ఎవరికి ఏ లక్షణమైన విరోధం లేని మాట. కానీ ఈ కర్మవాదులు కర్మ, జ్ఞానము రెండు సమానమైనవి, అని రెండింటినీ ఒకే స్థానంలో నిలబెట్టడానికి వారు ప్రయత్నం చేస్తున్నారు.

→ఇంక సిద్ధాంతం రాలేదు - సిద్ధాంతం తరువాత వస్తుంది. భాష్యంలో కర్మమీద కొన్ని విమర్శలు ఉన్నాయి. కర్మమీద కొన్ని oppositions ఉన్నాయి. అన్నీ pickup చేసి వాటికి కూడా పరిష్కారం చేసేసి, ఇన్ని విధాలుగా కర్మ శ్రేష్ఠమైనది గాబట్టి కర్మ, జ్ఞానము ఒకే level లో ఉండాలి అని ప్రతిపాదన. అప్పుడు బాగా బలం చేసినట్టు అవుతుంది. గాబట్టి కర్మ వాదాన్ని బలం చేయటం కోసం కర్మకి opposit point ఒకటి తీసుకొచ్చి దానికి సమాధానం చెపుతున్నారు. తరువాత

"హింసాదియుక్తత్వాదేవ శ్రైతం కర్మ అధర్మాయ ఇతి ఇయమపి ఆశంకా న కార్యా"

→ అయ్యా, కర్మ మోక్షాన్ని ఎట్లా ఇస్తుంది? కర్మలో హింస ఉంటుంది. కర్మ అనేటప్పటికి హింస ఉంటుంది ఉదా: 16 - సమిధల కట్టె పోయటం - పురుగు.

→ఆ విధంగా కర్మలో హింస ఉంటుంది, గీతాచార్యుడు ఒకచోట అంటాడు - "సర్వారంభా హి దోషేణ, ధూమేనాగ్నిరివావృతాః" - ఇప్పుడు మంట పెట్టారంటే పొగ తప్పదు. అలాగ మంట అంటే కాంతి - దాని పక్కనే పొగ ఉంటుంది నల్లగా. ఇది Bright గా ఉంటే అది Dark గా. అలాగ కర్మలో దోషం ఉంటుంది. ఏదో హింసాది

దోషం ఉంటుంది (కాబట్టి) అని ఒక ఆశంక. అది మరి కర్మకి Negate అవుతుంది చూడండి మరి. ఏం పాపాది దోషం ఉంది కదా కర్మలో. హింస అంటే మరి అధర్మమే కదా మరి అటువంటి కర్మనీకు మోక్షం ఎలా ఇస్తుంది? అని అలాంటి శంక మీరు పెట్టుకోవద్దు. అని అంటున్నారు "ఇతి చేత్ న కార్యా".

"కథమ్? క్షాత్రం కర్మ యుద్ధ లక్షణం గురు భ్రాతృ పుత్రాది హింసా లక్షణం అత్యంత క్రూరమ్ అపి స్వధర్మః ఇతి కృత్వా న అధర్మ్యం॥"

→ కథమ్? - అటువంటి శంక ఎందుకు పెట్టుకోకూడదు? అంటే చూడండి ఒక కర్మ స్వధర్మం అయితే మంచిది, స్వధర్మం కాకపోతే చెడు. అలా ఉంటుంది వ్యవస్థగానీ, హింస ఉంటే (మంచిది) చెడు, హింస లేకపోతే మంచి అలా ఉండదు వ్యవస్థ. హింస కానీ, అహింస కానీ, తనంతట తానుగా ధర్మం కానీ, అధర్మం కానీ కాదు. దేశ కాలాలని బట్టి అహింసా ధర్మం కావచ్చు, హింస కూడా ధర్మం కావచ్చు. అది సంగతి

→ Eg: యుద్ధం ఉన్నది - క్షాత్రం కర్మ యుద్ధలక్షణం. యుద్ధం అనే కర్మ, అది క్షాత్రం కర్మ. క్షత్రియ వీరుడు తప్పనిసరిగా చేయవలసిన కర్మ. ఒకప్పుడు "గురు, భ్రాతృ, పుత్రాది హింసా లక్షణం" - ఎప్పుడు కూడా ఒకే Group లో ఇద్దరు Brothers విడిపోయి దెబ్బలాడుకున్నారనుకోండి, అప్పుడు ఎటునుంచి ఎటు వెళ్ళినా మన బంధువులు దెబ్బ తినటం జరుగుతుంది. Eg: India & Pak - relatives

→ కాబట్టి హింస ఉన్నదని మనకి కావలసిన వారి రక్తం చిందుతుందని ఆ Basis మీద మీరు ధర్మ, అధర్మాల నిర్ణయం చేయకూడదు. వారి కర్తవ్య కర్మ అయినా కాదా, అదే Basis అంతే. Eg: Surgeon, Surgery చేస్తే దాన్ని హింస అంటారా? అలాగే స్వధర్మం - అది హింస అయినా కూడా అది తప్పు కాబోదు.

"న కరిష్యసి చ, తతః స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి (2-33) ఇతి బ్రువతా"

→ ఇతి బ్రువతా శ్రీకృష్ణేన - అని ఈవిధంగా చెప్పుచున్న శ్రీకృష్ణుని చేత ఈ విషయం నిర్ధారణ చేయబడి ఉంది అని అంటున్నారు. ఏమిటది? నీవు గనక హింస ఉందనో, పైగా హింస కూడా మనకి కావలసిన బంధువులకి సంబంధించిన హింస

ఉంటుందో నువ్వు అలాగంటూ సందేహాలు పెట్టుకొని "లోకసంగ్రహ" నీ కర్తవ్య కర్మని నువ్వు చేయకపోతే "అలా స్వధర్మం కోల్పోయిన పాప మవుతున్నావు" నువ్వు స్వధర్మాన్ని కర్మని పోగొట్టుకొని పాపాన్ని పొందుతావు అంటాడు.

→ Eg:- ఆ Stock Market లో Directors – conflict of interest is not accepted

→ ఆ CEO అన్నవాడు ధర్మ-ధర్మాలు correct గా ఉండాలి మాట్లాడకూడదు అని Help చేస్తానంటే ధర్మం అవదు, అధర్మం అవుతుంది

→ అదే అంటున్నాడు శ్రీకృష్ణుడు. నీ కర్తవ్యం యుద్ధం అయి ఉండగా, నువ్వు హింస చేయకూడదనుకొని, చేస్తే నా వాళ్ళ మీద చేయకూడదనుకో అదే గనక నీ కర్తవ్యాన్ని, నువ్వు చేయటం మానేస్తే కోల్పోతావు, పాపం కూడా వస్తుంది నీకు. అని చెప్పాడు.

→ కాబట్టి హింస ఉంది కాబట్టి కర్మ వల్ల మోక్షం రాదు అనే Argument నువ్వు పెట్టద్దు అని అలాగ దాన్ని workout చేసుకున్నారు.

4

"యావజ్జీవ శ్రుతి చోదితానాం సర్వది హింసా లక్షణానాం చ కర్మణాం ప్రాగేవ న అధర్మత్వమ్ ఇతి సునిశ్చితత్వము ఉక్తం భవతి ఇతి॥"
– ఇంత వరకు పూర్వ పక్షం

→ యావజ్జీవ శ్రుతి ఉంది – Eg:- "యావజ్జీవం అగ్నిహోత్రం జుహోతి" (బతికి ఉన్నంత కాలం కర్మని చేయమన్నారు. వైదిక కర్మ. వైదికుడు బతికి ఉన్నంతకాలం వైదిక కర్మ చేయమని శ్రుతి ఉంది. ఆ కర్మని చేసే సందర్భంలో సర్వది హింస ఉంటుంది. హింస ఉంది అని కర్మని మానేయటానికి వీలు లేదు. హింస ఉన్నా అది స్వధర్మం అయితే ముందుకు వెళ్ళవలసిందే. అకర్మవాదులు – కర్మ మీమాంస అలాగే ఉంటుంది. So ఆ హింస point కాదు ఇక్కడ. హింస by itself ధర్మం అని, అధర్మం అని నిర్ధారణ చేయకూడదు ఇక్కడ. హింస అన్నది కొంచెం కఠినమైన విషయం అది Eg:- కడుపులో పురుగులు – Tablets వేసి చంపటం – అడ్డాలు వాదన. ఇవన్నీ బయట దోమను చంపటం అన్నది రెండూ ఒకటే అని లేక అలాగంటాడు that is too much of an argument. But then He is going on similar lines.

→ కాబట్టి ఏదైనా కచ్చితంగా హింస ఉంటుందనేమీ. హింస ఉందని నువ్వు దాన్ని ఏమీ తప్పించుకోవటానికి వీలు లేదు. ధర్మమా, అధర్మమా అని చూసుకోవాలి కాబట్టి నీ మనసులో ధర్మం ఉన్నట్టు

కర్మయందు కొద్దిగా హింసాదులు ఉన్నాయి గనక కర్మమార్గం ఇచ్చారు అని అంటారు
Argument లు చేసి పెట్టారు కర్మ మార్గాన్ని ఇస్తుంది కాబట్టి కర్మ-జ్ఞానము కలిసే
ఉంటాయి. ఇది - అది పూర్వ పక్షం. ఇప్పుడు తిరచ్ఛేదం

సిద్ధాంతము ÷

" తదసత్ । " = అది తప్పు - ఆ Argument తప్పు. ఎందువల్ల?

"జ్ఞాన కర్మ నిష్ఠయోః విభాగ వచనాత్ బుద్ధిద్వయాశ్రయయోః" - సుగ్రహ భాష్యం

→ తదసత్ - ఇక్కడి ప్రతిజ్ఞ అంటే Declaration. నువ్వు చెప్పింది తప్పు.
దాన్నే ప్రతిజ్ఞాభాష్యము అంటారు. ఎందువలన అంటే సంగ్రహంగా చెబుతారు

→ జ్ఞాన నిష్ఠ, కర్మ నిష్ఠ. నిష్ఠ అంటే commitment దానికి కట్టుబడి ఉండటం
జ్ఞాననిష్ఠ, కర్మ నిష్ఠ అని రెండు ఉన్నాయి. ఈ రెండూ వేర్వేరుగా విడదీసి చెప్పాడు
శ్రీ కృష్ణుడు - "విభాగ వచనాత్". ఎందుకు విడదీసి ఎందుకు చెప్పాలి? పోనీ
కలిపే చెప్పొచ్చు కదా! జ్ఞాననిష్ఠలో ఉన్నవాడే కర్మనిష్ఠలో కూడా ఉండొచ్చు కదా! అంటే
అట్లా కుదరదు. Its a problem. ఏమిటంటే problem. బుద్ధి ద్వయ ఆశ్రయయోః।

→ జ్ఞాన నిష్ఠకి సంబంధించిన thinking process ఒకటి, కర్మ నిష్ఠకి సంబంధించిన
thinking process మరొకటి And these two are "opposed to each other"
కాబట్టి జ్ఞాన నిష్ఠకి సంబంధించిన బుద్ధి, thinking process - బుద్ధి అనేది ఉంటుంది
చూడండి - బుద్ధి నిర్మాణం. So The though value system. the thought
structure ఉంటుంది, ఆ thought structure లో కర్మనిష్ఠ దాంట్లో ఇమ్మ
ఇముడదు. కర్మనిష్ఠలో ఉండే thought structure లో జ్ఞాననిష్ఠ ఇముడదు. చాలా
clear గా ఉంటుంది - విషయం

→ శంకర భగవత్పాదుల భాష్యంలో clarity is the hallmark. Main thing is
clarity. Eg ÷ ఒకాయన కర్మ చేస్తున్నాడు. కర్మ ఎందుకోసం చేస్తున్నారు అంటే ఏమంది
ఒక కోరిక తీరటం కోసం. కోరిక తప్పేం కాదు. కామన కోసం కర్మ చేస్తున్నారు. ఆ
కోరిక తీరితే ఏమి ఉంటుంది? ఆనందం - సుఖసంతోషాలే కలుగుతుంది ఒకతను lottery
కోసం వ్రతం ఉపాసన. ఏదో చేస్తున్నాడు. వారం రోజుల తరువాత lottery తీస్తారు. ఈ లోపల
పూజ అది చేస్తున్నట్లయితే కొంచెం బలం చేసుకున్నట్లయితే మనకి గిట్టుబాటు అవుతుంది
కొన్న వస్తువ ticket కి దారికి కష్టపడటం కంటే కొంచెం పూజ అది చేసుకున్నట్లయితే

lottery తగిలితే లాభం కి ఇదుగోసం అలా పూజ చేసుకుంటున్నారు. పూజే చేస్తున్నారు కానీ వాటివల్ల అదృష్టం ఏమి చేయటం లేదు పూజే చేస్తున్నారు.
ఇంకొకరు ఉన్నారు వీరంటారు ఆత్మ పూర్ణము. నా మనస్సులో ఏ కోరికలు లేవు ఉండవు, కోరిక కలిగి ఉండటము అజ్ఞానము అని వీరంటారు. ఇదో బుద్ధి, అదో బుద్ధి. ఈ రెండు బుద్ధులు. బుద్ధి అంటే thought structure thought pattern. వీరి బుద్ధి, వారి బుద్ధి.

*→ ఈ lottery ticket కొన్న వాడు ఉన్నాడు చూశారా వాడి thought pattern వాడ్ని అడిగితే వాడు ఏమి చెప్తాడో! నన్ను అడిగితే నేను చెప్తా! వాడి thought pattern ఏమి అది అంటే నేను అసంతృప్తుడను, అల్పుడను, అభాగ్యుడను నాకు గనక ఆ ధనం మాట వచ్చినట్లయితే దానివలన నాకు సుఖాలు వస్తాయి. ఆ సుఖం వస్తే నేను Happy గా ఉంటాను. అది లేకపోతే నేను దుఃఖ భాజనుడను. ఇది వీరి యొక్క ఆలోచన. ఇంక ఈ ఆత్మజ్ఞాని ఉన్నాడే వీడు ఏమంటాడో తెలుసా ఆత్మ పూర్ణము, ఆత్మ ఆనంద నిధానము. ఆత్మ ఆనంద స్వరూపము, Intrinsically happyness it is. దాంట్లోకి ఆనందం బయటనుంచి రానక్కర లేదు. ధనాదుల వల్ల ఆనందం కలుగదు. ఆత్మ జ్ఞానం వల్ల ఆనందం కలుగుతుంది. ధనాదుల వల్ల ఆనందం కలిగినప్పుడు కూడా ఆత్మానందమే ఆవిధంగా ప్రకటమైనది ధనం నుంచి, వస్తువు నుండి ఆనందం వచ్చిందనుకోవడం అది అజ్ఞానం అని అంటాడు.

→ ఈ రెండింటికీ పొంతన కుదురుతుందా అండి? ఒకే మనిషి రెండు ఆలోచనలు కలిగి ఉంటాడా? ఈ రెండూ Are they compatible? like software compatible వింటున్నారంటే ఈ సగము కర్మ చేసినాడు. వాడు చేయునది పుణ్య కర్మ వాడి ఆలోచనా విధానం అంతా కూడా ఆత్మ జ్ఞానానికి విరుద్ధంగా ఉంటుంది. ఈ ఆత్మజ్ఞానాన్ని అనుసరించేవాడు, వీడి ఆలోచనా విధానం అంతా కూడా సగము కర్మకి విరుద్ధంగా ఉంటుంది ఈ రెండింటిని కలిపేసి మేము synthesis చేస్తాము అని అంటే, మహానుభావులు అంటారు ఎలా చేస్తావు నువ్వు synthesis, తెలిసి చేస్తావా, తెలియకుండా చేస్తావా తెలియకుండా చేస్తే అజ్ఞానం అది, తెలిసి చేస్తే synthesis పొసగదు వాటికి ఆ రెండూ కలవవు ఈ బుద్ధి యొక్క నిర్ణయం వేరు. ఆ బుద్ధి యొక్క నిర్ణయం వేరు. ఎలాగ? Eg: మీ ఉదయం క్రమం ఎలా? - మీ జీవితం తీసుకుందాం నేను చూస్తా

కర్మ చేయాలంటే కర్మ వెనక ఒక thought pattern ఉండాలి, ఒక సంకల్పం ఉండాలి
సంకల్పాన్ని బట్టి కర్మ వస్తుంది గానీ కేవలము జడ వస్తువు లాగ, ఒక Robo లాగ
కర్మ చేయలేదు కదండీ. సంకల్పం ఉండాలి కదా. కాబట్టి కర్మ చేయటానికి కావలసిన
సంకల్పము, ఆత్మ జ్ఞాన నిష్ఠకి కావలసిన ఆలోచనా సరళి ఈ రెండింటికీ పొసగదు.
పరస్పర విరుద్ధము పైగా oil & water లాంటివి. They don't stay together
అందుకోసం జ్ఞాన కర్మ సముచ్చయం అన్నది కుదరదు.

→ ఒకడు కర్మ నిష్ఠ ఉండి, జ్ఞాన నిష్ఠ ఇంకా లేదు. వాడు కర్మ చేసుకుంటాడు, మరొకడు
కర్మ నిష్ఠలోంచి జ్ఞాన నిష్ఠ లోకి వచ్చాడు వాడు ఈ కామ్య కర్మలను అన్నింటినీ పక్కన
పెడతాడు, జ్ఞాన నిష్ఠుడిగా ఉంటాడు. అలా సమన్వయం కుదురుతుంది గానీ. లేదా
సమాజంలో ఒకడు కర్మనిష్ఠుడు ఉంటాడు, మరొకడు జ్ఞాననిష్ఠుడు ఉంటాడు
అది సమన్వయం. ఒకే మనిషి జీవితంలో ముందు కర్మనిష్ఠుడు, తరువాత
జ్ఞాన నిష్ఠుడు. అది సమన్వయం. అంతే కానీ రెండింటికీ కలిపి ఏకకాలంలో చేయాలి
అనుకుంటున్నాడు అంటే He is not honest to himself అని పొసగదు అని
అంటారు. ఆ సంగ్రహ వాక్యానికి అర్థము అది.

→ కాబట్టి జ్ఞాన కర్మ నిష్ఠయోః - అంటే జ్ఞాన నిష్ఠా, కర్మ నిష్ఠా అని అర్థము
బుద్ధి ద్వయాశ్రయయోః! జ్ఞాననిష్ఠకి ఆశ్రయమైన బుద్ధి ఒకటి, కర్మనిష్ఠకి
ఆశ్రయమైన బుద్ధి మరొకటి ఇది వేరు, అది వేరు. ఒకే బుద్ధి structure లో ఇవి
అని రెండు సమకాలంలో ఉండవు. కాబట్టి వాటికి "విభాగ వచనాత్" - వాటికి
వాటికి విడి విడిగా లక్ష్యాన్ని లేదా చూపించినాడు గనక అలా చెప్పాడయన.
కాబట్టి ఆయన విభాగం చేసి చూపించేది సమన్వయం కలపకూడదు.
Eg:- కన్ను కలక, కడుపులో నొప్పి - Doctor - మందు - Reverse చేయకూడదు.

→ Eg:- తేలులు - అంబులాలు, కీటకాలు - అలాగ కలపకూడదు. వివేక

→ శంకర భాష్యం యొక్క ప్రత్యేకత వివేకం. Discrimination అంటే correct గా అర్థం చేసే వాళ్ళ

→ ఆయన వివరిస్తున్నారు. ఆ సంగ్రహ భాష్యానికి వివరణ.

" వివరణ భాష్యము :
అశోచ్యాన్ (2-11) ఇత్యాదినా భగవతా యావత్ స్వధర్మమపి చావేక్ష్య (2-31)
ఇత్యేతదంతేన గ్రంథేన యత్ పరమార్థ తత్త్వ నిరూపణం కృతం తత్ సాంఖ్యమ్ |"

→ విభాగ వచనాత్ జ్ఞానయోగ - బుద్ధి వ్యయము, రెండు బుద్ధులు - వేరువేరు అని ప్లైన్ చెప్పారు. ఆ మాటలని వివరిస్తున్నారు. సూత్రము - వివరణ ఇక్కట్నుంచి
→ అశోచ్యాన్ అని మొదలు పెట్టారు అని మొదలు పెట్టి, స్వధర్మమపి చావేక్ష్య అని 31/30 వ శ్లోకం ఇక్కడ మొదలు పెట్టి ఆ శ్లోకం ముందు శ్లోకం వరకు దేహీ నిత్య మవధ్యోయం అని ఆ శ్లోకంలో అంతం అన్నమాట. అంతవరకు ఇవి 20 శ్లోకాలు ఈ 20 శ్లోకాలలో Eg+ ఉపోద్ఘాతంలో ఈ 20 శ్లోకాల మీద పాఠం.
→ ప్రతీ రోజు పాఠం చెప్పేటప్పుడు చాల జాగ్రత్తగా చెప్పేవాళ్ళు, ఒక్క పసుపు బిల్ల జలదారం చేద బిల్ల దగ్గర పెట్టుకొని పాఠం చెప్పేవాళ్ళు ఎందుకంటే ఇక్కడ ప్రతిపాదన చేసేటు వంటి సిద్ధాంతము విని గలరో అటు లోకంలో మనం ధర్మం - ధర్మమే, ధర్మంలోనే, మన ధర్మాలలోను, భక్తి లోను పూజలోను ఏ భావజాలం ఉంటుందో దాని అంతటిని కూడా తిరస్కరించి దానికి వ్యతిరేకంగా ఉంటుంది ఆ ప్రతిపాదన. Eg:-
→ లోకంలో మరణం చనిపోగా ఆయుష్యం పెరగటానికి బోలెడంత వ్యవస్థ ఉంటుంది ఇక్కడికొచ్చే టప్పటికి అసలు మరణం అంటున్నాము, మరణం అనేది లేదు అని ఇక్కడ చెప్తారు ఎలాగ ఈ రెండింటికి సంబంధము ఎంత కష్టం. పాఠం చెప్పటం. అందరూ లోకంలో జన్మ ఒకటి, మరణం ఒకటి ఉందని అనుకుంటారా? జన్మతిథి వచ్చినప్పుడు మొక్కులు నీకోసం వస్తుందా? మరణం అనే పేరు చెపితే భయపడుతూ ఉంటారా? అటువంటి ఈ సమాజంలో ప్రవేశించి గీతలో అశోచ్యా నన్వశోచస్త్వం పాఠం చెప్పాలంటే. పిడుగుల లాంటి వాక్యాలు - "దేహీ నిత్య మవధ్యోయం, దేహే సర్వస్య భారత", "అచింత్యోయం, అవికార్యోయ ముచ్యతే", "తస్మాదేవం విదిత్వైనం నను శోచితు మర్హసి" ఈ వాక్యాలు పిడుగుల లాంటి వాక్యాలు. మన ఆలోచనా పద్ధతి వీటికి పూర్తి వ్యతిరేకంగా ఉంటుంది దాన్ని తీసుకొచ్చి వీటి పుణ్య, పాప, కామ్య కర్మలు వీటన్నిటికి ముడి పెడతానంటావేంట్రా? ఎక్కడా compatibility లేదు రెండింటికి అని చెప్పటం కోసం ముందు విభాగాన్ని చెప్తున్నారు.
→ 2వ శ్రీకృష్ణ భగవానుని చేత - భగవత - అశోచ్యాన్ దగ్గర మొదలు పెట్టి యావత్ స్వధర్మమపి చావేక్ష్య" అనే శ్లోకం వరకు ఆయన ఏం చెప్పాడంటే 'ఆత్మ తత్వ నిరూపణం' ఆత్మ యొక్క తత్వాన్ని నిరూపించాడు. అసలు ఆ తత్వము అనే పదానికి అర్థం ఏమిటి అంటే "అనారోపిత ఆకారం తత్వం". మరి ఒక గుణాన్ని, ఒక ఆకారాన్ని చెపితే అది తత్వం కాదు.
Eg:- శ్రీరాము తత్వం - దశరథ పుత్రుడు - వంశం, ఆజాను బాహుడు - దేహం, అత్యంత పరాయణుడు

శరణాగత రక్షకుడు - గుణాలు చెప్పినట్లుంది. ఆత్మను ఇంకా చెప్పలేదు.
శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః - ఈ శ్రీరాముడే శ్రీ వస్తువు యొక్క అవతారము.
వస్తువు అంటే ఎక్కడో ఒక చోట కూర్చుంటాడని కాదు. ఈ సకల జగత్తు రూపముగా
ప్రకటిస్తున్న ఏ సత్-చిత్ బ్రహ్మ గలదో, అది విష్ణు శబ్దము చేత నిర్దేశింపబడుతూ
ఉంటుంది అని చెబితే అది ఆత్మను చెప్పినట్టు. ఈ ఆత్మను చెప్పగానే Doubt. ఇది
ఏమిటంటే ఈ సర్వ వ్యాపకమైన బ్రహ్మ రాముడెలా అయ్యాడు? అని, దానికి మళ్ళీ
సమాధానం. అంతేల ఆత్మను అంటే ఈ గుణాలకి, ఆకారాలకి, నామాలకి, రూపాలకి
చెపితే దాన్ని ఆత్మ అని అనరు. కాబట్టి ఇక్కడ ఆత్మ తత్వాన్ని చెప్పారు. ఆత్మ
తత్వాన్ని మీరు ఎప్పుడయితే తెలుసుకుంటారో మీ గుణాలు, రూపాలు, ఆకారాలు, స్వభావాలు
ఇవన్నీ వేరు వేరుగా ఉన్నా ఆత్మను ఒక్కటే, అది పూర్ణము, అది బ్రహ్మ అని తెలిసి
పోతుంది. మీరు తెలుసుకోకుండానే దానిని మొదలుపెట్టి ఆత్మ బ్రహ్మ ఎలా అవుతుంది
అని అంటే ఎవరూ ఏమీ చెప్పలేరు గానీ, మీరు ఒక్క పనిలో ఓపిక పట్టి తెలుసుకుంటే
ఆత్మ బ్రహ్మ - అంటే పూర్ణము అని అర్థము - అని దాంట్లో సందేహానికి తావు ఏమీ
ఉండదు. కాబట్టి ఈ పరమార్థ ఆత్మ తత్వ నిరూపణము. పరమార్థ అంటే Absolute reality
what do you mean by absolute reality? for Eg:- నేను ఎవరు అని మీరు ప్రశ్న
వేసుకోండి. వేసుకోగానే నేను తండ్రిని, కొడుకుని చూసి అది పరమార్థం ఎలా అవుతుంది? ఎందుకంటే
ఆ కొడుకు పుట్టక ముందు నీవు ఉన్నావు. నీకో కొడుకు పుట్టాక వచ్చిన నువ్వు నా
కొడుకువు కావని అన్నట్టుగా అప్పుడు కూడా ఉంటావు. అది ఉన్నవాడు కూడా వదిలే
ఈ విధంగా తండ్రి అన్నది వాడి యొక్క Absolute status కాదు అది Relative status. ఎవరు
కూడా కొడుకు ఉంటే నీవు తండ్రి. అలాగే భర్త, భార్య, officer, Any profession all
are relative status. మరి మీ అసలు status ఏమిటి? కాబట్టి మీరు ఏది చెప్పినా
relative status. దాంట్లో absolute ఇంకా రానే లేదు. నేను పురుషుడను, స్త్రీ
relative to the body. I am a cheerful guy. relative to the mind-
unhappy- mind what are you absolutely? అది పరమార్థ ఆత్మ తత్వ
నిరూపణము. అది తెలుసుకోవాలనే ఈ 20 శ్లోకాలలో బోధిస్తారు. ఈ బోధ ఏదైతే గలదో ఈ
Subject matter దీనికి ఒక పేరుంది. దాని పేరు సాంఖ్యం. ఆ పేరు ఎందుకు వచ్చిందంటే
"సమ్యక్ ఖ్యాయతే అనేన" ఖ్యాయతే అంటే జ్ఞాయతే. ఈ subject matter